# దివ్యశ్రీలు






పైడిపాటి సుబ్బరామశాస్త్రి

మూల్యం :

ముప్పావులా.



★

ప్రథమ
ముద్రణం.
1959
జూలై.

★

ముద్రణం :
విజయ ప్రెస్
విజయవాడ - 2.

★

ప్రతులకు :
భారతీ నికేతన్
మారుతీనగర్
విజయవాడ - 3

# తొలి పలుకు



## ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థాన కవులు

## శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి మహోదయులు

(25—3—59)

కవిసమ్రాట్ పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారద్యతనాంధ్రమున ప్రముఖ జాతీయకవులు. వీరి కవితాశక్తి పరమమైనదని చిరకాలమునుండి కవిపండితులచే వేనోళ్లఁ బ్రశంసల నందుకొన్నది.

ప్రకృత మీ కావ్యము దేశమాతకు దివ్వటీల పట్టునదై యున్నది. ఈ కావ్యమునకుఁ గృతిపోషకులుగా లోక్ సభాధ్యక్షులైన శ్రీమాన్ అనంతశయనం అయ్యంగారి వంటి పండితుల నెన్నుకొనుటలో వీరెంతయు నౌచిత్యముఁ బ్రకటించిరి.

ఆంధ్ర ప్రజాహృదయాస్థానకవులైన శ్రీ శాస్త్రిగారి కివే నా యాశీస్సులు.



# విషయ సూచిక



# కృతిపోషకులు

## శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగార్.

మాడభూషి వం
శాలంకారా !
ఈడెవ్వరు - నీ
కయ్యంగారా.

అనంతశయనం
అంటే చాలు -
అమృత హృదయమే
అందిచ్చేవు.

భారత శాసన
సభాధ్యక్షుఁడా !
పాలింతువు నియ
మమ్ము, దక్షుఁడా.

కారా చేరిన
వారికి నీవై -
దేవ భాష నే
ర్పిన ఆచార్యా.

రసాలమై నీ వా
శ్రయ మిడెదవు
రసజ్ఞుఁడా ! కవు
రారతి, నీ కో,

మాడభూషి వం
శాలంకారా !
అనంతశయనం
అయ్యంగారా.



# దివ్వటీలు

అరులను కత్తి వాదర చీల్చి చెండాడు
రాయల దైన విక్రాంతి నేల
రాణియై, యరికి రుద్రాణియై వెల్గు, రు
ద్రమ్మ జన్మము నందినట్టి నేల
గుణసముద్రుఁడు రాజ కోటీరమణి రాజ
రాజు పాలితము వరాల నేల
ఆంధ్ర విష్ణువు రాజహంస మేలిన నేల
యందాలు చిందిన యట్టి నేల

ధర్మ మహితుండు మఱియు నుద్దామయశుఁడు
మఱపునకు రాని యట్టి యా మనుమసిద్ధి
కొలువు తీర్చినయట్టి యీ తెలుఁగు నేల
దివ్వటీల్ పట్టువాఁడ నేఁ దెలుఁగు వాఁడ.

అమృతహస్తుఁడు నన్నయార్యుండు తెలుఁగులోఁ
గైతకు దిద్దె శ్రీకార రేఖ
పరమ భక్తుఁడు త్యాగ పరమేష్ఠి కృతులలో
గానమ్ము పండించి గాదె వోసె
ఇక్షు ఖండమ్ము సిద్ధేంద్రుండు నాట్యంపు
రోచిస్సులను నిల్పె కూచిపూడి
తెలుఁగు శిల్పులు వెన్నెలలఁజిందినా రమ
రావతీ ప్రభృతి పురమ్ములందు

నంతయు కళామయమ్ము, దివ్యమ్ము తెలుఁగు
తెలుఁగటన్నను నొక పెద్ద వెలుఁగు నిజము;
నిజముగాఁ దెల్గు దేవి వర్ణించి నిలచి
దివ్వటీల్ పట్టువాఁడ, నేఁ దెలుఁగు వాఁడ.

తేనె సోనలఁజాలు వీనుల విందుగా
వినిపించు నా కృష్ణ వేణి వీణ
నవ్య వైఖరులతో భవ్య గోదావరి
రమ్యమ్ముగా మర్దళమ్ము వినుచు

రింగురింగున సాగి తుంగభద్రమ్మ తా
    లయశుద్ధముగనుఁ దాళమ్ము వేయు
వన్నె చిన్నెల వంత పాట పాడుచు పెన్న
    రమణీయముగఁ దంబురాను మీటు

భారతీయమ్ము నార్ష ప్రభాకరమ్ము
దివ్య నాట్యమ్ము సలుప మా తెలుఁగు దేవి
అంజలింౘెద, దేవి ! నీ యాలయమున
దివ్వటీల్ పట్టువాఁడ నేఁ దెలుఁగు వాఁడ.



# నా దేశము

'కుహూ కుహూ' వాల్మీకి కోకిల మ్మిటఁ బాడె
నమృతమయమ్ము రామాయణమ్ము
శాంతతేజము పరాశర సూతి, యిట నూదె
పంచమ వేదమ్ము భారతమ్ము
కవిలోక పూజ్యుండు కాళిదా సిటఁ బల్కె
శాకుంతలమ్ము రసార్ణవమ్ము
పరముండు కరుణలో భవభూతి యిటఁ బల్కె
రమణీయ ఫణితిలో రామచరిత

భరతుఁ డాదిగ సాహితీపరులు నిచట
దర్శనముఁజేసి కావ్య సౌందర్యమూర్తి
వెలువరించిన యట్టి పృథ్వీతలమ్ము
రసమహస్సుల పరిధి భారతము నాది.

కృష్ణతాదాత్మ్య సంకీర్తనములె విన్చు
నవగళమ్మున యమునాస్రవంతి
శివ జటాజూటమ్ముఁ జింది చిందులు ద్రొక్కు
కలిపాపహారము గంగాస్రవంతి
వలగొన్న మున్నీటి పన్నీటి జలకేళి
నవకమ్ము మీఱు కన్యాకుమారి
తెలిమంచుతో నచ్చ తెలివి భాసించును
నత్యున్నతమ్ము హిమాలయమ్ము

నీతి నియమంపుఁ బండు వెన్నెలలఁగాచి
సత్ప్రభుండగు శ్రీరామచంద్రమూర్తి
గృహ గృహమ్మునఁ దానె శబ్దించు నెచట
శ్రుతి హితమ్ముగ, నట్టి భారతము నాది.

ఢాకకున్ నిల్చి సెల్యూకస్సు నోడించు
కొమఱుమీఱిన చంద్రగుప్త నృపతి
రాజనీతిని విశారదుఁడైన శౌర్య ప
రాక్రమమ్ముల కృష్ణరాయ నృపతి

యడవులఁబట్టి తా నిడుములం జెందియుఁ
దలవంచనట్టి ప్రతాప నృపతి
తెల్లవారల నెల్ల విల్లమ్ములనుఁ దాకు
వీరాధి వీరుఁ డల్లూరి నృపతి

ఛత్రపతి యనఁచు దుష్ట శాసనము నెదిరి
రాజధర్మమ్ము నిలుపు ధరాధిపతియు
నవతరించిన యట్టి పుణ్యంపు నేల
రమ్యతరమైన వీర భారతము నాది.



# క్రొత్త స్వర్గము

ఎవఁడురా వాఁడు, గుండియ లెన్ని వచ్చి
కొట్టెరా, గాంధి గుండెల గుండుదెబ్బ;
ఎవఁడురా వాఁడు, గుండియ నేమిచేసి
కొట్టెరా-గాంధి గుండెల గుండుదెబ్బ.

అయయొ ! చచ్చినజాతికి నాయు విచ్చి
పరమ ధీరుఁడవై జాతి కొఱకుఁ జచ్చి
చచ్చి బ్రదికిన వాఁడవై శాంతి నిచ్చి
సాక్షివై నిల్చినావటే స్వామి ! నీవు.

సంద్రమ్ములై పొంగె జవహరు కన్నీరు
వల్లభాయి యెడంద పెళ్ల విఱిగె
రాజేంద్రబాబు ధైర్యమ్ము బీటలు వాఱె
వగచె రాధాకృష్ణ పండితుండు

డగ్గుత్తి పడెను పట్టాభి గొంతుక బిట్టు
టంగుటూరికి గుండె రావు తప్పె
భారతమ్మునఁ బట్టపగలె చీకటి తోచె
తోచె విశ్వమ్మునఁ దోకచుక్క

శాంతి సత్య మహింసయు సాధనమ్ముఁ
జేసి చేసిన నీ యొడల్, శీర్ణమైన-
పాతకమ్మెంత చేసెరా, భరతజాతి !
కటకటా ! గాంధి సాదు రక్తమ్ముఁ జిందె.

తొలి కవాటమ్మునఁ బలుకరించును నిన్ను
బాలగంగాధర పండితుండు
మలి కవాటమ్ము పువ్వులు మంకెనల్ పట్టుఁ
జల్లుగా నీ మీద ఝాన్సిరాణి
'జైహిందు'తో నమస్కారమ్ము లర్పించు
సైన్యమ్ముతో సుభాశ్చంద్రబోసు
సింహాసనమ్మునఁ జేర్చి యర్ఘ్యంబిచ్చుఁ
గ్రొత్త దేవేంద్రుఁ డల్లూరి రాజు

సరసఁ జేరిన సిద్ధార్ధ శాక్య యోగి
తాను చెప్పని భక్తి తత్త్వముఁ జెప్పి
జాతి నడిపించి నావని సంతసించు
స్వర్గ రాజ్యమ్ము నీ వేగు సమయమందు.

వడుకు నీకయి నూలు పిడుల బంభరవేణి
రాట్నమ్ము - రంభ, విరామ వేళ;
నులి వెచ్చఁజేసి దొప్పలఁదెచ్చి యందిచ్చు
మేనక ముప్పొద్దు మేకపాల
నొలిచి భద్రముచేసి యూర్వశి తినఁబెట్టుఁ
జాయఁదేరిన వేళుశనగ పప్పు
రామభక్తుఁడు దుగ్గిరాల గోపాలుండు
పని వెట్టుకొని 'రామధునుల' వినుచు

మన రవీంద్రుఁడు 'జనగణమననుఁ' బాడు
జాతి వాసించు సరిక్రొత్త స్వర్గసీమ
బోసి నవ్వుల వెలుఁగుల దూసివోసి
తలఁచు కొనుచుందు నవభారత ప్రశస్తి.

# శ్రీ రామ రక్ష

అయిదు వేళ్ళనుఁ బిడికిలి యైననాఁడు
ముష్టిఁ జూపించు వైరి సమూహమునకు
గుండె ప్రాణమ్ము వంటి లోగుట్టు నిలుచు
జనుల కలయిక సకలార్థ సాధకమ్ము.

పరమ ధర్మమ్ము మఱచిరి భారతీయ
రాజవంశ్యులు, నట్టులే ప్రజలు - మఱియు
కకవికలు పుట్టె, జనులు చీకాకు వడిరి
తట్టుకోలేని దెబ్బగాఁ దగిలె నొసట.

ధైర్యమ్ము సన్నగిలె, దో
ర్వీర్యమ్మునుఁ బలుచఁబడియె, లేనే లే దా
శౌర్యమ్ము, తొంటిపసయును
ఆర్యేతరమైన దండయాత్రా ఫలమై.

అయిన, నొక వంద యేండ్లు వెన్నైక్రనాఁడు
మఱచి పోలేనిది, మహోద్యమమ్ము జఱిగె
నుదయ మయ్యెను ఫలము, ననూరు జన్మ
వోలె-పోయె నీ జాతి పాతాళమునకు.

పట్టి కుడిపిన దెంత పాపంపు ఫలమొ!
పరమ దైన్యంపు బానిస బ్రదుకు వచ్చె
పరమ శాంతమ్ము దేశ విప్లవము సాగె
సాగె, తొంబది యేడుల చలము సాగె.

ఎందఱెందరొ సమిధలై యిట్టె హుతము
లైరి, స్వాతంత్ర్య యజ్ఞమ్మునందుఁ దొల్లి
వారి త్యాగంపు ఫలితమ్ము వచ్చె రాజ్య
మదియు నొక రంభ, జనులు విహారమతులు.

భూలోక స్వర్గముగా
నేలాగున ననుభవింతు రెల్లరు జనులున్
ఆలాగున నీ రాజ్యము
పాలించిన నాఁడె వెలుఁగు పంటలు పండున్.

రాముఁ డేలేను మఱి ధర్మరాజు నేలె
ఏలుచుండిరి యేలిరి యెందరేని
ఎందరేలిన, ధర్మమ్మునందు నిలువ
రాజ్య మెప్పుడు మనకు శ్రీరామరక్ష.

(ప్రథమ స్వాతంత్ర్య సమర శతవార్షికోత్సవ సందర్భమున వ్రాయబడినది)



రాముఁ డేలేను మఱి ధర్మరాజు నేలె
ఏలుచుండిరి యేలిరి యెందరేని
ఎందరేలిన, ధర్మమ్మునందు నిలువ
రాజ్య మెప్పుడు మనకు శ్రీరామరక్ష.

(ప్రథమ స్వాతంత్ర్య సమర శతవార్షికోత్సవ సందర్భమున వ్రాయబడినది)



దారి వెంబడిఁ జనిన పూజారి గుడిని
బోసి నవ్వుల, దేవికిం బూసె పదము
లందు పారాణి వీరుల రక్త రేఖ-
నయనముల నామె కయ్యె నానందరేఖ.

శాంతి సత్య మహింసల జపముఁ జేసి
దేవళమ్మున పూజారి తీర్థ మిచ్చె-
నిచ్చి నంతనె, సిలుగులు విచ్చిపోయె
ప్రజల కంతట దేవ్యనుగ్రహముఁ గలిగె.

గుడిని గంటలు మ్రోగు సవ్వడులు రెండు
కాగ, దేవియు రెండుగాఁ గానుపించె;
సరభసమ్మున దేవీ విషాదమూర్తి
చిఱునగవుతోడ ప్రజల కాశీస్సు లిచ్చె.



# జనవరి ఇరువది యాఱు

ఏల యీనాడు బాలురు బాలికలునుఁ
బెద్దలునుఁ గ్రొత్త యందాల దిద్దుకొనిరి
తాండవించును సమధి కోత్సాహరేఖ
వదన వదనమ్మునందు దివ్యమ్ము శోభ.

కదనుఁ ద్రొక్కిన సైన్యమ్ము కరణివారు
నియమబద్ధమ్ముగా నొక్క నేల నిలచి
పాడుకొనుచుండి, రా పాట యేమొకాని
జనగణమ్ముల మనము లుజ్వలము లయ్యె.

పాడుచున్నది యక్కడివారె యైన
కోట్ల గుణకమ్ములైన వాక్కులు నదించి
యొక్కటే పాటగా, శబ్ద మూది పలికె
ప్రియతమమ్మైన మాతృదేవీ స్తవమ్ము !

సొగసు లెగబోసినట్టులై యెగురుచుండె
చేతనమ్మైన భారత కేతనమ్ము
అంజలించిరి చేతమ్మునందె కాక
కరము కరములతోడ నందరునుభక్తి.

మాన్యతమమైన భారతమాత తోచె
దర్శనీయమ్మునైన కేతనమునందు
చిఱునగవుతోడ నామె యాశీస్సు లొసగె
నభయహస్తాన తన కోట్ల యనుఁగు ప్రజకు.

ఎట్టి పావిత్ర్య మిందు కుంభించుకొనెనో
జనవరిని దేశహితము పండిన దినమ్ము !
పండుగదినమ్ము కోట్లాది భారతీయ
ప్రజలకయ్యెను - తలను తురాయిమొలచె.

పంచ ఖండమ్ములందునఁ బరమమైన
ఏషియాఖండమందు మహీయమైన
భరతదేశమ్ము, దీప్తి సంభరిత మగుచు
తథ్య మీ నాఁడు సర్వస్వతంత్ర మయ్యె.



సొగసు లెగబోసినట్టులై యెగురుచుండె
చేతనమ్మైన భారత కేతనమ్ము
అంజలించిరి చేతమ్ము నందె కాక
కరము కరములతోడ నందరును భక్తి.

మాన్యతమమైన భారతమాత తోచె
దర్శనీయమ్మునైన కేతనమునందు
చిఱునగవుతోడ నామె యాశీస్సు లొసగె
నభయహస్తాన తన కోట్ల యనుఁగు ప్రజకు.

ఎట్టి పావిత్ర్య మిందు కుంభించుకొనెనో
జనవరిని దేశహితము పండిన దినమ్ము !
పండుగదినమ్ము కోట్లాది భారతీయ
ప్రజలకయ్యెను - తలను తురాయిమొలచె.

పంచ ఖండమ్ములందునఁ బరమమైన
ఏషియాఖండమందు మహీయమైన
భరతదేశమ్ము, దీప్తి సంభరిత మగుచు
తథ్య మీ నాఁడు సర్వస్వతంత్ర మయ్యె.



# పంచరత్నములు

స్వాగతమ్మాంధ్రభారతీ చరణ నిరత !
స్వాగతము జయభారతీ సద్మభాస !
స్వాగతము నృత్యభారతీ పదవిలోల !
స్వాగతము సుబ్బరామ సచ్ఛాస్త్రి వర్య !

ఆంధ్ర మహాజాతి యౌన్నత్యమున్ జాటు
నాంధ్రభారతి కావ్య మనవరతము
భారత జాతీయసంస్కృతిం జాటును
జాతీయభారతి రీతులెల్ల
భారత నాయక ప్రతిభనుఁ జాటును
జయభారతీ కావ్య సరణులెల్ల
కవితా తపోవ్రత కలనంబుఁ జాటుఁగ
దా ! రామలింగేశ్వ రాభిషేక
మద్దిరా ! నృత్యభారతి హర్షదాయి
మధురభారతి - వర్షించు మధురసుధలు
భారతినిఁ గొల్చినాడవు బహుముఖముల
నేమి ధన్యత ! శ్రీ సుబ్బరామశాస్త్రి !

కొందరు మెచ్చు పద్యపదగుంభన నైపుణి, గేయకావ్యమున్
గొందరు మెచ్చికొంద్రు, మఱికొందరు మెత్తురు
నాటకమ్ములన్-
కొందరు మెచ్చగన్ నవల, కొందరు మెత్తురు
సత్కథల్, జనం
బందరు మెచ్చు సద్రచన లద్దిర ! సేసితి వెంత దిట్టవో !

కవిసమ్రాట్టువు, దేశభక్తుఁడవు, సత్కావ్యేందిరాభవ్య గే
హ విలాసుండవు, భారతీ మధురభావావేశ సంపూరితుం
డవు, నానారచనా ప్రయుక్తరస నాట్యప్రాభ వౌన్నత్య శా
లివి, సర్వత్రన్ సుకవీంద్రవంద్యుఁడవు, మేల్మేలయ్య!
జోహారిదే !

దేవతామూర్తి కవితా సతీమతల్లి
దివ్య కావ్య సంపుటములు దేవళములు;
తత్పదార్చన నిరతి, వ్రతంబు నీకు
నేమి ధన్యుఁడవయ, సుబ్బరామశాస్త్రి !

రామువరపు నరసింగరావు.

# శ్రీ సుబ్బరామశాస్త్రి

| కృతులు : | | కృతిపోషకులు |
| --- | --- | --- |
| జాతీయభారతి | : | ఉపరాష్ట్రపతి, రాజ్యసభాధ్యక్షులు<br>శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణయ్య |
| దివ్వటీలు | : | లోక్ సభాధ్యక్షులు<br>శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగార్ |
| జయభారతి | : | ఆంధ్రప్రదేశ శాసనసభాపతులు<br>శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు |
| విజయభారతి | : | ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రులు<br>శ్రీ నీలం సంజీవరెడ్డి |
| మధురభారతి | : | ఆంధ్రప్రభుత్వ పూర్వామాత్యులు<br>శ్రీ తెన్నేటి విశ్వనాథం |
| మధురసంక్రాంతి | : | విజయవాడ పురపాలక సంఘాధ్యక్షులు<br>శ్రీ జంధ్యాల దక్షిణామూర్తి |

# శ్రీ సుబ్బరామశాస్త్రి కావ్యావళి

| | | | |
|---|---|---|---|
| 1 | జాతీయభారతి | (గేయములు) | రు 2-50 |
| 2 | జయభారతి | ,, | 0-50 |
| 3 | విజయభారతి | ,, | 2-00 |
| 4 | వీరభారతి | ,, | |
| 5 | విక్రమభారతి | ,, | |
| 6 | వందేమాతరం | ,, | |
| 7 | బాలభారతి | ,, | |
| 8 | బాలవాణి | ,, | |
| 9 | వఱద కృష్ణమ్మ | ,, | 0-50 |
| 10 | ఉదయభారతి | ,, | |
| 11 | జాజి పాటలు | ,, | |
| 12 | వివిధ భారతి | ,, | |
| 13 | నృత్య భారతి | ,, | 1-00 |
| 14 | మధుర భారతి | ,, | 2-00 |
| 15 | మధుర సంక్రాంతి | ,, | 1-25 |
| 16 | ఆంధ్ర భారతి | (పద్యములు) | 1-25 |
| 17 | అభిషేకము | ,, | 0-75 |
| 18 | దివ్వటీలు | ,, | 1-00 |
| 19 | శతపత్త్రము | ,, | |
| 20 | నీలవేణి | (కథలు) | |
| 21 | గోవత్సం : శ్రీవత్సం | ,, | |
| 22 | ఉషాసుందరి | (నాటకము) | 1-50 |
| 23 | అంకితం | ,, | |
| 24 | వాసంతి | (నవల) | |
| 25 | కూచిపూడి భరతం | (వ్యాసములు) | |

# సాహిత్యంలో స్వాతంత్ర్య ప్రభావం కనిపించాలి!

## శ్రీ కేస్కార్

మహమ్మదీయ శకం, బ్రిటిష్ పరిపాలన, భారతీయులను పూర్తిగా అణగద్రొక్కినై. ప్రజలకు ఉత్సాహశక్తి బాగా లభించినప్పుడు భాష, సాహిత్యం చక్కగా విలసిల్లినై. ఒకదేశపు ఆర్థిక, సాంఘిక సాంస్కృతిక రంగాలకు చెందిన ఉత్తమాభిప్రాయాలు ఆ దేశభాషలలో వెల్లివిరిస్తేనేతప్ప ఆ భాషకు మోక్షంలేదు. సాహిత్య వికసనానికి వేరే అవకాశం ఉండదు. ఈ కారణంవల్ల బ్రిటిష్‌పరిపాలనలో దేశభాషలు అణగారిపోయినై. సాహిత్యం కృత్రిమంగా తయారై భావకల్పనలకు అనువు కాకుండా కుంచించుకుపోయింది. ఒకదేశం ఐశ్వర్యంతో తులతూగుతున్నప్పుడు ఆ దేశసాహిత్యంకూడా ఉత్తమోత్తమంగా రూపొందటానికవకాశం ఏర్పడుతుంది. ఉదాహరణకు కాళిదాస భవభూతుల లేఖినుల నుండి వెలువడిన కృతులు అత్యుత్తమ చరిత్రకారుని రచనలకంటె మిన్నగా ఆకాలపు భారతప్రజల అభిరుచులను అభిజ్ఞలనుకూడా అద్భుతంగా వ్యక్తంచేశాయి.

విజ్ఞాన ప్రాభవముతో ఐశ్వర్య సముపార్జనకు పూనుకున్న ఒక నవయుగప్రాంగణంలో ప్రవేశించాము. మన స్వేచ్ఛా స్వాతంత్ర్యాల ప్రభావం సాహిత్యంలో ప్రస్ఫుటంగా కనుపించాలి. అణగిపోయిన మన సాహిత్యశక్తి తిరిగి సగర్వంగా తలయెత్తి మనలను ఉత్తేజపఱచాలి. ప్రపంచసాహిత్యంలో ఉన్నతస్థానం ఆక్రమించాలి...

[ 13-5-56 న ఎర్నాకులంలో అఖిల కేరళ సాహిత్యపరిషత్తు రజితోత్సవాలకు ప్రారంభోత్సవం చేసిన కేంద్ర సమాచారమంత్రి శ్రీ కేస్కార్ ఉపన్యాసంనుండి ]

సొగసు లెగబోసినట్లులై యెగురుచుండె
చేతనమ్మైన భారత కేతనమ్ము
అంజలించిరి చేతమ్మునందె కాక
కరము కరములతోడ నందరునుభక్తి.

మాన్యతమమైన భారతమాత తోచె
దర్శనీయమ్మునైన కేతనమునందు
చిఱునగవుతోడ నామె యాశీస్సు లొసగె
నభయహస్తాన తన కోట్ల యనుఁగు ప్రజకు.

ఎట్టి పావిత్ర్య మిందు కుంభించుకొనెనొ
జనవరిని దేశహితము పండిన దినమ్ము !
పండుగదినమ్ము కోట్లాది భారతీయ
ప్రజలకయ్యెను - తలను తురాయిమొలచె.

పంచ ఖండమ్ములందునఁ బరమమైన
ఏషియాఖండమందు మహీయమైన
భరతదేశమ్ము, దీప్తి సంభరిత మగుచు
తథ్య మీ నాఁడు సర్వస్వతంత్ర మయ్యె.

